ఓ౩మ్

# సార్వభౌమ ధర్మము



మహర్షి దయానంద సరస్వతి

-: రచన :-


**లోక బాలకృష్ణయ్య**

( వైదిక పురోహితులు )

1-8-700/10, నల్లకుంట, హైదరాబాదు



-: ప్రకాశకులు :-

విరాట్ ప్రచురణాలయము

ఆర్యసమాజము యాకూత్‌పుర, హైదరాబాద్

| ప్రతులు | అంగిరస | జూన్ | వెల |
|---|---|---|---|
| ౧౦౦౦ | జ్యేష్ఠ | 1992 | 1 రూపాయి |

ఓం

# ధర్మ లక్షణములు

ధర్మ మనగా ధారణజేయుటకు యోగ్యమైనది. అగ్ని యొక్క ధర్మము తీక్ష్ణము, అదియున్నంతవరకు అన్ని జీవులు అగ్నికి భయపడును. అది నశించిన బూడిద యగును. దానిలో కుక్కలు, గాడిదలు పొర్లాడును. మానవుడు గుండె లేక ఎట్లు జీవించలేడో అట్లే ధర్మము లేక జగత్తునడువదు - ధర్మమునకు పది లక్షణములు గలవు-శరీరమునకు అన్ని అంగము లుండవలెను. ఏ అంగమూ లేకున్నను శరీర మనబడదు. కాలు లేకున్న కుంటి వాడందురు. చేయి లేకున్న తొంట వాడందురు. కన్ను లేకున్న గ్రుడ్డివాడందురు. అట్లే ధర్మములో ఏ లక్షణము లేకున్నను ధర్మ మనబడదు.

శ్లో॥ ధృతి క్షమా దమోఽస్తేయ శౌచ మి-ంద్రియనిగ్రహ
ధీర్విద్యా సత్యమక్రోధో దశకం ధర్మ లక్షణమ్॥

## ౧. ధృతి

౧. ధర్మములో మొదటిది ధృతి. ధృతి యనగా ధైర్యము. ఇది రెండు విధములు. ఒకటి తన కొరకు చేయు ధైర్యము. రెండవది ఇతరుల కొరకు చేయునది.

ఒక గొల్లవాని-మేకలలో ఒక మగ మేక ఉండెను. అది బాగుగ బలిసి యుండెను. ఒకనాడది ఆడు మేకలతో తిరిగి మేతనే మరిచెను. సాయంకాలము

ఆకలివేయగ ఒక పొదలో చేరి మేయదొడగెను. ఇంతలో గొల్లవాడు మేకలను తోలుకొని ఇల్లు చేరెను. ఈ మేక మేత ముగించుకొని వచ్చుతరి, మేకలమంద లేదు. చీకటి పడెను. మేక విచారపడి తుదకు ఒక సింహము గుహలో చేరి పండుకొనెను. సింహము మేత ముగించుకొని తన గుహకు వచ్చి చూడగా మేక అగుపడెను. నా గుహలో పండుకొనుటకు నా కంటె ఒక గొప్ప జంతువై యుండునని భయపడి అది అచటనే ఆగెను. మేక సింహమును చూచి భయపడి ఇక నాకు చావు తప్పదని తలచి ధైర్యముతో లేచి సింహమా వచ్చితివా! నేను నీ కొరకే వేచియున్నాను. ఇంత వరకు నాలుగు పులులను తింటిని, ఐదు ఏనుగులను తింటిని, ఒక సింహమును తినకుండ ఈ గడ్డము తీయకూడదని తలచితిని. నేటికి నా కోరిక తీరినది అనెను. ఆ మాటలు విన్న సింహము గడగడ వణికి పారిపోయెను. తెల్లవారి మేక చావు తప్పిన దని సంతోషించి మందలో కలిసెను.

అపద వచ్చినప్పుడు ధైర్యముతో ఎదుర్కొని సాధించుట ధర్మమే యగును. ఈ ధైర్యము తన కొరకు చేసినది. ఎందరో ఇతరుల కొరకై ధైర్యము చేసి ఇతరులను అగ్ని నుండి జలము నుండి రక్షించిరి. ఇది గొప్ప ధర్మము.

## ౨. క్షమ

క్షమ యనగా క్షమించుట. మన భారతీయులకు క్షమ వెన్నుతో బుట్టినది.

కం॥ చంపదగిన యట్టి శత్రువు తన చేత జిక్కెనేని కీడు
సేయరాదు పొసగ మేలు చేసి
పొమ్మనుటే చాలు ॥వి॥ అన్నాడు వేమన.

అన్నియు తినరాదు. అన్నియు వినరాదు. అన్నియు చేయరాదు. ధర్మమును లక్ష్య మందుంచుకొని బుద్ధికి నిశ్చయమైన క్షమించుడు. మహాటొడ్డిస్

గోరీ పృథివిరాజు చేత బంధించబడి ఎన్నోసార్లు క్షమింపబడి విడువబడెను. ఒకప్పుడు పృథివిరాజే బంధింపబడి షహాబొద్దీన్‌ను క్షమించుమని కోరెను. అందుల కతడు రాజా! అప్పుడే నన్ను శిక్షించిన నీకు ఈ గతి పట్టెడిదికాదు గదా! అని అతనిని చంపించెను. ఒకప్పుడు రుద్రమ మహాదేవిచేత బంధించబడి దేవగిరి యాదవరాజు ఆమె ఎదుట నిలిచెను. ఆమె అతని వైఖరిని గని క్షమించి విడిచిపెట్టెను. యాదవరాజు తన జీవిత పర్యంతము ఆమెకు విధేయుడై ఉండెను. కావున క్షమించుట మంచిదేయైనను అందరిని క్షమించరాదు. దుష్టులను క్షమించి విడిచిన నేరములు ఎక్కువగును. కనుక యోగ్యులను క్షమించి అయోగ్యులను శిక్షించుటయే ధర్మము.

## 3. దమము

దమ మనగా మనస్సును ఏకాగ్రపరుచుట. మనుస్సులేనిది ఏ పనియు జరుగదు. కొందరు నామనస్సు నా స్వాధీనమందుండుట లేదందురు. అది వారి పొరపాటు. ఒకప్పుడు ఒక బ్రహ్మచారి జనకరాజుకడకేగి నా మనస్సు నా స్వాధీనమందుండుట లేదనెను. అప్పుడు జనకుడు స్తంభమును కౌగలించుకొని ఈ స్తంభము నన్ను పట్టుకొనినది. దీనికి ఉపాయమేమనెను. అందుల కా బ్రహ్మచారి నవ్వి రాజా! స్తంభము నిన్నెట్లు పట్టుకొనును. అది జడము. నీవే దానిని పట్టుకొంటి వనెను. అందుకు రాజు బ్రహ్మచారితో మనుస్సుకూడా జడమే, అది నిన్ను విడిచిపోదు. నీవే దానిని పంపినచో అదే పోవునందువు. అది సత్యము కా దనెను. రెండవ ఉదాహరణము- ఒకనాడు రాక్షసులు, మానవులు, దేవతలు తండ్రియగు బ్రహ్మదేవుని కడకేగి నాయనా మాకేమైనా ఉపదేశమిప్పుడని కోరిరి అందుకు బ్రహ్మ 'ద' అని ఉపదేశించెను. ద అర్థము రాక్షసులు దయ గలిగి యుండుడని చెప్పినాడని గ్రహించిరి. మానవులు ద అర్థము దానము చేయు మన్నాడని గ్రహించిరి. దేవతలు ద అర్థము దమము చేయుమని చెప్పినాడని గ్రహించిరి. మనుస్సును ఏకాగ్రపరచి ఆలోచించి చేసిన పనియే ధర్మము.

## ४. అస్తేయము

అస్తేయమున కర్థము కూడబెట్టుట యని చేసితిని. ధర్మమూలం మిదం జగత్ అనుటకు మారుగ ధన మూలం మిదం జగత్ అని యనబడుచున్నది. ప్రతి మానవునకు ధనము అవసరమే. ధనములేనిది ఏపనియు జరుగదు. ధన హీనుని తల్లిదండ్రులు కూడా లక్ష్య పెట్టరు. భార్య చులకనగ చూచును. సంతానము గౌరవించదు. బంధువులు ఏవగింతురు. కావున ధనము సంపాదించుము. కాని సంపాదించుటయే ముఖ్యము కాదు. ధనము సజ్జనుని కడనుండిన సద్వినియోగ మగును. దుర్జనుని కడనుండిన దుర్వినియోగ మగును. ధనము సంపాదించునపుడు ధర్మమును లక్ష్యమందుంచుకొనుము. కొందరు సన్యాసులకు ధన మెందుల కందురు. సన్యాసులకు శరీరము లేదా ఆకలిదప్పు లుండవా? ఒక రాజు సన్యాసము గ్రహించి సర్వమును దానము చేసెను. అతనిని ఒక విద్యార్థి పరీక్షకు సుంకము లేదని కోరెను. ఆ సన్యాసి ఒక విద్యార్థికి పరీక్ష సుంకము ఇవ్వలేని ఈ సన్యాస మెందులకని వాపోయెను. రంతిదేవుడు సర్వస్వమును త్యజించి భిక్షకు డయ్యెను ఒకనా డతనికి భిక్ష దొరుకక మలమలమాడి మృత్యువాతబడెను. కావున డబ్బు అందరికి అవసరమే. కాని దానిని మితముగ వాడవలెను.

ఒక సాహుకారి చాలా డబ్బు సంపాదించి తన నలుగురు కుమారులకు పంచి ఇచ్చి తానుండుటకు ఒక గది మాత్రమే యుంచుకొనెను. తెల్లవారి పెద్ద కుమారుని కడకేగెను. అతడు రెండు రోజులు మాత్రమే గౌరవించి ఆహార మిడెను. కాని మూడవ నాడు అతనికి అన్నమే కరువయ్యెను. తండ్రివద్ద ఏమియు లేదని తెలిసికొని తక్కిన వారు కూడా నిర్లక్ష్యముచేసిరి. తండ్రి విచారములో మునిగెను. అల్మారీ అంత వెదకిన ఇరువది రూపాయలు మాత్రమే దొరికెను. వానినుండి ఐదు రూపాయల తాళము కొని గదికి వేసెను. రాత్రి అందరు నిద్రించుచుండగా మిగిలిన పదిహేను రూపాయలను చన్ చన్ మని కొట్టు

చుండెను. కుమారులు ఆ చప్పుడు విని తన తండ్రి వద్ద ఇంకా చాల డబ్బు కలదని అనుకొనిరి. తెల్లవారి కుమారులు వచ్చి నాయనా మా ఇంట్లోనే భోజనము చేయు మని ప్రార్థించిరి. తల్లిదండ్రులు అందరి కడకెగుచు ఆనందము అనుభవించిరి. తండ్రికి అవసాన కాలము వచ్చెను. భార్యను పిలిచి తాళము చెవి ఇచ్చి దీనిని ఎవ్వరికిని ఇవ్వవలదని చెప్పుచు ప్రాణము వదిలెను. కొడుకులు అంత్యక్రియలు ఘనముగా జరిపిరి. తల్లిని కూడా అట్లే గౌరవించిరి ఆమె కూడా చనిపోవుటకు పూర్వము అందరు ఆ గదికి తాళాలు వేసిరి. అంత్యక్రియల తర్వాత గది అంత వెదికిరి. పదిహేను రూపాయలు మాత్రమే లభించెను. అప్పుడు వారు తాము చేసిన పొరపాటు, తండ్రి చేసిన యుక్తిని గ్రహించిరి ఈ కథ వలన తన్ను మాలిన ధర్మము పనికిరాదని తెలిసినది. ధనము ధర్మ యుక్తముగా సంపాదించి ధర్మమునకై వ్యయ పరచుము.

## ౨. శౌచము

శౌచమును పవిత్రత, శీలము అనబడును. మానవునకు శౌచము ఎంతేని అవసరము. మన ఇండ్లను దేహమును ఎట్లు పరిశుద్ధము చేయుచున్నామో అట్లే మన అంతఃకరణములను కూడా పవిత్ర పరచవలెను. అంతఃకరణ పవిత్రతయే ముక్తికి సోపానము.

దేవతలకు రాజు ఇంద్రుడు. రాక్షసులకు రాజు ప్రహ్లాదుడు. ఒకప్పుడు ప్రహ్లాదుడు. ఇంద్రలోకముపై దాడి సల్పెను. రాక్షసుల ధాటికి తాళలేక దేవతలు పరుగిడుచుండిరి. ఇంద్రుడు భయపడి బృహస్పతిని సలహా అడిగెను. అందులకు బృహస్పతి. నీ వద్ద శీలము లేదు. ప్రహ్లాదుడు శీలవంతుడు నీ వతని వద్దికేగి శీలమును గ్రహించిన జయము కలుగు ననెను. ఇంద్రుడు ప్రహ్లాదునికి సేవచేసి శీలమును బడసెను. ఇంద్రునకు జయము కలిగెను. శీలవంతునకే జయము కలుగును. శీల మెక్కడో బలము అక్కడే. ధర్మరాజు శీలమువలననే ఇంద్ర

లోకమున స్థానము సురక్షితం చేయబడెను. ఒకనాడు ఇంద్రుడు సభను తిలకించగా ఒక ఆసనము రిక్తముగనుండెను. ఇది ఎవరిదని ప్రశ్నించగ భూలోకమున నున్న ధర్మరాజు దని తెలిసి మాతలిని పిలిచి ధర్మజుని తోలుక రమ్మని పంపెను. అప్పటికే ధర్మరాజు పరీక్షితునకు రాజ్య మొసగి వానప్రస్థులైరి. మార్గముననే ద్రౌపది యుక్తముగ సహోదరులు నలుగురు కాలధర్మము నొందిరి. ఒక కుక్క మాత్రమే తన వెంట నుండెను. ఇంతలో మాతలి వచ్చి ఇంద్రలోకమునకు రమ్మనెను. ధర్మజుడు ముందు ఈ కుక్కను కూర్చుండ బెట్టుకొమనెను. అందులకు మాతలి ధర్మరాజా! నీవు పుణ్యాత్ముడవు కనుక నీ కొరకు స్వర్గమున స్థానం ఉంచబడినది. కుక్క కెక్కడిది అనెను. అందులకు ధర్మజుడు మాతలీ! నన్ను వీడి నా భార్యా తమ్ములు పోయిరి. ఈ కుక్క మాత్రము పోవుట లేదు. దానిని విడిచి నేను స్వర్గమునకు రాలేను. ఇది ధర్మము కాదు. నీ వొప్పిన నా పుణ్యము లో సగము కుక్క కిత్తు ననెను అందుకు మాతలి సంతసించెను. వారు కుక్క యుక్తముగా స్వర్గమున కేగుచుండిరి మార్గమున నరక లోకము వచ్చెను. ధర్మజుని పుణ్యపు గాలి సోకి నరకవాసులకు కొంత శాంతి కలిగెను అప్పుడు నరక వాసులు ధర్మరాజా! నీ పుణ్యపుగాలి సోకి మా శ్రమ తగ్గినది. కొంతసేపు నిలువు మని కోరిరి. అందుకు ధర్మజుడు. మాతలీ! నా వలన వీరికి శాంతి లభించెనేని నాకు స్వర్గ మక్కరలేదు ఇచటనే యుందు ననెను. ఇది ధర్మజుని శీలము.

ఓం విశ్వాని దేవ సవితర్దురితాని పరా సువ యద్భద్రం తన్న ఆసువ! హే పరమేశ్వరా! నా దురితములను దూరపరచి ముక్తిని ప్రసాదింపుము. పవిత్రత గలవాడే ధర్మాత్ముడు అతనికే ముక్తి.

## ౬. ఇంద్రియ నిగ్రహము

రామాయణమున దశరథుడు, దశకంఠుడు ముఖ్యులు. దశరథుడు తన ఇంద్రియములను స్వాధీనమందుంచుకొనెను. దశకంఠుడు తన ఇంద్రియములను

స్వేచ్ఛగ విడిచెను. వేదమున ఓం సుషారథిరశ్వానివ యన్మనుష్యాన్నే నీయతేఽభీషుభిర్వాజిన ఇవ, హృత్ప్రతిష్ఠం యదజిరం జవిష్ఠం తన్మే మనః శివ సంకల్పమస్తు. రథమును నడుపు నతడు అశ్వముల పగ్గములను తన చేత నుంచుకొనిననే గమ్యస్థానము చేరును. పగ్గములను వదలిన అశ్వములు తన స్వాధీనమందుండక రథమును ఏ గోయిలోనో పడవేయును. కనుక ఇంద్రియములను స్వాధీన మందుంచుకొనిననే మనము మన గమ్యస్థానము చేరగలము. కొన్ని జీవులు ఒకే ఇంద్రియమునకు దాసులై తమ ప్రాణములను గోలుపోయినవి. మానవుడు దశేంద్రియములను స్వాధీనపరచుకొనవలెను. చేప జిహ్వా చాపల్యమునకు లొంగి గాలమునకు గ్రుచ్చిన ఎరను తినుటకై వచ్చును. అప్పుడా ఎర్ర వచ్చేవు పోయ్యేవు నా కొరకు. వచ్చి కూర్చున్నాడు నీ కొరకు సగము సచ్చినాను నీ కొరకు-స్వాంతం చచ్చేవు నా కొరకు అనెను. దీనిని లక్ష్యపెట్టక చేప గాలమునకు తగుల్కొని చనిపోవును. భ్రమరము తామరపూవుల లోని మకరందమునకు భ్రమసి మృత్యువు పాలగును. శలభము దీప కాంతికి భ్రమసి ప్రాణము లర్పించును. పాములు నాదమునకు లోబడి పట్టుబడును. అట్లే మానవులు ఇంద్రియములకు దాసులై తమ జీవితమును పాడు చేసుకొను చున్నారు. కావున ఇంద్రియములను స్వాధీనమందుంచుకొని బుద్ధి గలిగి మెలగి గమ్యస్థానము చేరుటకు యత్నించుడు. ఇదియే మానవ ధర్మము.

## ౭. బుద్ధి

ధర్మ లక్షణములలో ఏడవది ధీ. 'ధీ' అనగా బుద్ధి. మనము మన బుద్ధిని గురించి కొంత ఆలోచింతము. మనకు ఈశ్వరుడు కలదను జ్ఞానమున్నది. అయితే మనము తీసుకొను లంచమునకు శిక్ష గలదని తెలియదా ? దొంగ తనముచేసిన తప్పు. సాక్ష్యము పలికిన, నేతిలో డాల్డను కలిపిన, తేనెలో బెల్లము కలిపి, కల్తిచేసి మోసగించిన పాపమని తెలియదా ? ఈశ్వరుడొక్కడేయని వేదములు తెలుపుచుండగా. దేవతలు ముగ్గురని, ౩౩ కోట్లని, అసలు దేవుడు లేనే

లేదని చెప్పువారు ఇందులో సత్యమేదో గ్రహించితిరా? మనకు సత్యము తెలిసికొన వలెనని బుద్ధి యున్నదా? వేదములు పరమేశ్వరుడు నిరాకారుడు, అజన్ముడు, అమరుడు, నిత్యుడని తెలుపుచుండగా మన వారు, ఈశ్వరుడు భూలోకమున అవతరించెనని, చచ్చెనని, దొంగిలించెనని, వ్యభిచరించెనని తన అవతారములతో తానే పోట్లాడెనని, తల్లిని చంపెనని చెప్పు మాటలను నమ్మి ఇందులోని సత్యమును తెలిసికొనినామా? మనకు బుద్ధియున్నదిగదా తెలిసికొనుటకు.

కొందరు భగవంతుని రాతితోను, మట్టితోను, కర్రతోను, పెండతోను, ప్రతిమలుచేసి పూజించి ధన్యులమనుకొనుచున్నారు. జంతువులకు, వృక్షములకు, ప్రతిమలకు వివాహముచేసిన మోక్షమని తలచిరి. మానవులకు జంతువులు, జంతువులకు మానవులు, పుట్టిరనిన నమ్మితిమి. సూర్యచంద్రులతో ఆడుకున్నారని, సూర్యుని మ్రింగినాడని మానవుడు కుండలో పుట్టి సముద్రము నీళ్ళన్నియు త్రాగెననిన నమ్మితిమి. చెవిలోనుండి, చెమటనుండి మానవులు పుట్టిరనిన నమ్మితిమి. మనకు బుద్ధి ఉన్నదా? విభూతి పూసికొనిన, భుజములు కాల్చుకొనిన ముక్తి కలదని నమ్మితిమి. ఇట్లెంతని వ్రాయవలెను. మనకు బుద్ధి ఉన్నదా? ఆలోచించుడు. చెప్పుటకే సిగ్గగుచున్నది. అందుకే వేదములో గాయత్రీ మంత్రమునందు "ధియో యో నః ప్రచోదయాత్" పరమేశ్వరా నాకు బుద్ధిని ప్రసాదించుమని ప్రార్థించబడినది. బుద్ధి వలన సర్వము లభించును. బుద్ధి లేనిచో సర్వము నశించును. శ్రీకృష్ణుని బుద్ధిబలమే కంస, జరాసంధ, దుర్యోధనాదులగు దుష్టులను వధించెను. చాణుక్యుని బుద్ధిబలమే నందులను నాశనముచేసి చంద్రగుప్తుని రాజుగ జేసినది. కావున బుద్ధిని ఉపయోగించి పని చేయుము

కథ: (1) ఒక యువకుడు సముద్రతీరమున విహరించుచుండగా ఒక చేప ఎగిరివచ్చి భూమిపైబడి కొట్టుకొనుచుండెను. అది గని దీనికేదో రోగము వచ్చినదని తలచి బాగుచేయుటకై ఇంటికి తీసికొని తేనీరు కాచి దాని నోటిలో

పోసెను. అందువలన అది చనిపోయెను. దానిని చంపుటకు కారకుడు అత డయ్యెను. కొంత బుద్ధి యున్నను వెంటనే దానిని నీటిలో వేసిన బ్రతుకేదది.

(2) ఒక ఊరిలో నొక బ్రాహ్మణుడు అతని భార్య ఒక కుమారుడు ముగ్గురు భిక్ష చేయుచు జీవించుచుండిరి. ఒకనాడు భిక్ష కూడ కరువయ్యెను. ఉపవాసముచే చచ్చుట కంటె తపస్సు చేయవలెనని అడవిలో తపస్సు చేయుచుండెను. భగవంతుడు ప్రత్యక్షమయ్యి వరము కోరుకోమనెనట. అందుల కా బ్రాహ్మణుడు మేము ముగ్గురము. మూడు వరములు ఏది కోరిన అది అగునట్లు ఇమ్మనెను. భగవంతుడు అట్లే యగునని పోయెనట. ఇంటికి రాగానే భార్య నా వరము నాకిమ్మని కోరెను. భార్య హఠము కాదనలేక ఆమె వరము ఆమె కిచ్చెను. భార్య:- ఓ భగవంతుడా! నీ విచ్చిన వరము నిజమగునేని నా ఈ ముసలితనము పోయి సుందర నవయవ్వనవంతురాల నగుదునుగాక అని కోరెను. ఆమె వెంటనే సుందర స్త్రీ యయ్యెను. ఉదయమున వాకిలి ఊడ్చుచుండుగా రాజుగారు ఆమె సౌందర్యము చూచి ఇంతటి రూపవతి ఊడ్చుటయేమని రథమున నిడుకొని పోవుచుండెను. అది చూచిన కుమారుడు అమ్మను రాజుగారు తీసికొనిపోవుచున్నా డనెను. తండ్రి పోనిమ్ము అక్కడనైన సుఖపడగలదనెను. కాని కుమారుడు నా వరము నాకిమ్మని హఠము చేసెను. తండ్రి బాలహఠమునకు విసిగి వరమిచ్చెను. అప్పుడు కుమారుడు ఓ పరమేశ్వరా నీవిచ్చిన వరము నిజమగునేని రాజుగారి రథములో నున్న మా అమ్మ కోతి అగుగాక అని కోరెను. ఆమె వెంటనే కోతి అయ్యెను. ఆ కోతిని రాజుగారు వెడలగొట్టిరి. అది అయ్యగారి యింటి మీద కూర్చొని పెంకులు విప్పదొడగెను. అది గనిన ఆ బ్రాహ్మణుడు ఉండుటకు కొంపగూడ లేకుండపోవునని ఓ భగవంతుడా! నీ విచ్చిన వరము నిజమైన ఆ కోతి నా భార్య నా కగుగాక యని కోరెను. వెంటనే ఆ కోతి ముసలిభార్య అయ్యెను. మూడు వరములు పోయెను. మునుపటి గతియే పట్టెను. బుద్ధి లేకున్న ఇటులనే జరుగును. కనుక బుద్ధి గలిగి మెదులుము.

ఒక వైశ్యుడు, గ్రుడ్డివాడు, దరిద్రుడు తపస్సుచేసి ఒకే వరము పొందెను. అదేమన నా మునిమనుమడు బంగారు పళ్లెములో తినుచుండగా నేను చూడ వలయును. ఈ ఒకే వరము అతని అన్ని కోరికలు తీర్చెను. కావున బుద్ధి గలిగి ఆలోచించి పని చేయవలెను. దేనిని గ్రుడ్డిగా నమ్మవలదు.

## ౮. విద్య

ఓం విద్యాంచాఽ విద్యాంచ యస్తద్వేదోఽ భయగ్ం సహ
అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽ మృత మశ్నుతే॥

విద్య యనగా జ్ఞానము. విద్యను పెంపొందించి, అవిద్యను నాశనము చేయవలెను. నేడు స్వార్థపరులు మోసము చేసి నమ్మించి తప్పు గడించు చున్నారు. ఇట్టి వారిని దరి జేరనీయరాదు. వేదమే సర్వ సత్య విద్యల భాండా గారము. వేదానుకూలముగ నడచుటయే ధర్మము. నేడు సినీమాలో తప్పుడు ప్రచారములు ఎక్కువగా ప్రచారమగుచున్నవి. శఠగోపుని గురువు మునివాహ నుడు మేదరివాడు. తపస్సు చేయుచుండగా ఒక వృద్ధురాలు మ్రొక్కెను. నీకేమి కావలయునని అడిగిన నా ముసలితనము పోయి యవ్వన సుందరిని కావలయుననెను. వెంటనే ఆమె యవ్వనవంతురాలయ్యెను. వయస్సువారు వృద్ధులగుదురేకాని, ముసలివారు వయస్సు వారగుట ప్రకృతికి విరుద్ధము కాదా? శ్రీరాముడు పోతన రూపమున వచ్చి భోజనము చేయుట, భాగవతము వ్రాయుట సత్యమా? త్రేతాయుగము నాటి శ్రీరాముడు ఇప్పుడు వచ్చెనని నమ్ముట అజ్ఞానము కాదా? ఇట్లు ప్రకృతికి విరుద్ధములై అసంభవమగు కథలు సినీమాలో చూచి సత్యమనుకొనుట అవిద్య కాదా? కావున బుద్ధిమంతులు సత్యాఽసత్యము లను తెలిసికొని మెదలుటయే ధర్మము.

## ౯. సత్యము

సత్య మనగా ఉన్నదున్నట్లు నమ్ముట, రాతిని దేవుడనుట అసత్యము గాదా! ప్రతిమలను, చెట్లను సమాధులను దేవుడనుట అసత్యము కాదా! "సత్యమేవ జయతే నానృతం" సత్యమునకే జయము-అసత్యవాదిని ఎవ్వరు నమ్మరు. ఒకడు నీ సద్ది అన్నము నాకివ్వుము నీకు ఆకలి కలుగకుండు మంత్రము చెప్పుదుననిన నమ్మవలయునా? అతనికి ఆకలిలేని మంత్రమే వచ్చిన నా సద్ది అన్నము ఎందులకుకోరును అని ఆలోచించకూడదా? సత్య నారాయణ ఏదికోరిన అది ఇచ్చునని కథలు చెప్పుదురు. ఈ కథలు చెప్పువారెందరో దరిద్రులుగ-సంతాన హీనులుగా నున్నారు. వారు వ్రతములుచేసి భాగ్యవంతు లేలకారు అని ఆలోచించకూడదా, గ్రుడ్డిగా నమ్మవలయునా? స్వార్థపరులు ఇతరులను మోసగించి కల్లబొల్లి మాటలు చెప్పుదురు. మనము సత్యాఽసత్యము లను తెలిసికొని సత్యమునే గ్రహించుట ధర్మము.

## ౧౦. అక్రోధము

అక్రోధమనగా కోపము లేకయుండుట "కోపంబు కూడదు కులమెల్ల జెరుచు, కోపమునను ఘనత కొంచెమైపోవును. శాంతము సర్వాంగభూషణము" అన్నారు పెద్దలు. యుద్ధమున కోపము లేక శత్రు సంహారము జరుగదు. కోప మును అదుపులో ఉంచుట మంచిది. కోపము మితిమీరిన తాను ఏమిచేయు చున్నది తనకే తెలియదు.

ఒకప్పుడు కౌరవ, పాండవులకు ద్రోణాచార్యులు అక్రోధమును గురించి పాఠము బోధించెను. అందరు పాఠము అప్పగించిరి. కాని యుధిష్ఠరుడు మాత్రము నాకు పాఠము జ్ఞాపకము కాలేదనెను గురువుగారు కోపగించిరి. ధర్మరాజునకు కోపమువచ్చెను. తెల్లవారి అడిగిన ఇంకను పాఠము జ్ఞాపకము కాలేదనెను. గురువునకు కోపమువచ్చి యుధిష్ఠిరుని దండించెను. అప్పుడు కూడా యుధిష్ఠరు

నకు కోపమువచ్చెను. ద్రోణాచార్యులు భీష్మాచార్యులతో చెప్పెను. భీష్మాచార్యులు ధర్మజుని పిలిచి నాయనా! నీవు అందరికంటె పెద్ద వాడవు. ఇంత చిన్న పాఠము జ్ఞప్తి చెయలేక పోయితివా అని యడిగెను. అందులకు యుధిష్ఠిరుడు తాతయ్యా, పాఠము చాలా కఠినమైనది. గురువుగారు కోపగించినపుడు నాకు కోపమువచ్చెను. ఇప్పుడు నేను ఆ కోపమును మ్రింగితిని. పాఠము జ్ఞాపకమైనది, కోపము రావటము లేదనెను. పాఠము అనుభవమునకు వచ్చినప్పుడే జ్ఞాపకమైనట్లు. నోటిలో అని అచరణలేని విద్య వ్యర్థము అక్రోధము ధర్మములో నొకటని భావించవలెను.



# ఆర్యసమాజ నియమములు

౧. సమస్త సత్య విద్యలకును, విద్యవలన నెరుంగదగు సర్వ పదార్థములకును ఆదిమూలము పరమేశ్వరుడు.

౨. ఈశ్వరుడు సచ్చిదానందస్వరూపుడు, నిరాకారుడు, సర్వశక్తిమంతుడు, న్యాయకారి, దయాళువు, అజన్ముడు, అనాది, అనంతుడు, నిర్వికారుడు, అనుపముడు, సర్వాధారుడు, సర్వవ్యాపకుడు, సర్వాన్తర్యామి, అజరుడు, అమరుడు, అభయుడు, నిత్యుడు, పవిత్రుడు, సృష్టికర్తయునై యున్నాడు. అతనినే ఉపాసించుట యోగ్యము.

౩. వేదము సమస్త సత్య విద్యల పుస్తకము. వేదమును చదువుట, చదివించుట; వినుట, వినిపించుట ఆర్యులకందరికి పరమధర్మము.

౪. సత్యమును గ్రహించుటకును, అసత్యమును త్యజించుటకును ఎల్లప్పుడు సిద్ధముగా నుండవలెను.

౫. సకల కార్యములను ధర్మానుసారముగా అనగా సత్యాసత్యములను విచారించి చేయవలెను.

౬. ప్రపంచమునకు ఉపకారము చేయుట ఆర్యసమాజము యొక్క ముఖ్యోద్ధేశ్యము. అనగా శారీరకోన్నతికి, ఆత్మికోన్నతికి మరియు సామాజికోన్నతికి పాటుబడవలెను.

౭. అందరితో ప్రీతిపూర్వకముగ, ధర్మానుసారముగ, యథాయోగ్యముగ వ్యవహరించవలెను.

౮. అవిద్యను నశింపజేసి, విద్యను పెంపొందింప జేయవలెను.

౯. ప్రతివ్యక్తియు తన యున్నతితోనే సంతృప్తి నొందక అందరి యున్నతిలోనే తన యున్నతి కలదని తలంచవలెను.

౧౦. సర్వహితకరములగు సామాజిక నియమములను పాలించుటలో పరతంత్రులై, వ్యక్తిహితకరములగు నియమములందు స్వతంత్రులగుట అందరికి తగును.

---

విరాట్ ప్రెస్, ఆర్యసమాజము యాకూత్‌పుర, హైదరాబాద్ - 500023